

అన్నపూర్ణా వారి

# ప్రేమలేఖలు

సులోచనా రాణి నవల

నిర్మాత

దుక్కిపాటి మధుసూదనరావు

దర్శకత్వం

కె. రాఘవేంద్రరావు

...వయుగ

వెన్నెల - ...

# నటీ నటులు

మురళీమోహన్
అనంత్‌నాగ్
సత్యనారాయణ
జగ్గయ్య
అల్లురామలింగయ్య
గిరిబాబు
భానుప్రకాష్
వివేకానందమూర్తి
పొట్టిప్రసాద్
మల్లాది

జయసుధ
దీప
శుభ
పుష్పలత
విజయలక్ష్మి
బేబీ వరలక్ష్మి
బేబీ రాణి

# కథా సంగ్రహం

వయసులో వున్న ఆడపిల్ల - ఏది ప్రేమో - ఏది ఆకర్షణో తెలుసుకోలేక పోవచ్చు... కారణం రెండూ తియ్యగానే వుంటాయి. కాకపోతే ఆకర్షణ క్షణికం - ప్రేమ శాశ్వతం ఆ తేడాలు తెలిసీ తెలియని తొలి వయసులో కన్నెపిల్ల కన్నకలలకి ప్రతిబింబాలే ప్రేమలేఖలు....

తేనె లూరే ప్రేమలేఖలే....ఒక్కొక్కసారి ముందు జీవితంలో .... తుఫానులు రేపవచ్చు, నిప్పులు కురిపించవచ్చు....

అమాయకమైన ఆశలు - కోరికలతో నిండిన ఆ కాగితాలు....జీవితాలకే ముప్పు తేవచ్చు....

వసంతం లాంటి వయసులో వున్న సుజాత జీవితంలోకి వురకలెత్తే ప్రవాహం లాంటి మదన్ ప్రవేశించాడు....ఆమె మనసును మాయచేసి వయసుకి మత్తెక్కించాడు. సాయం సంధ్య - వెన్నెల - చల్లగాలి - చీకటి....అన్నీ కూడా ఆ కన్నెపిల్లని కదిపి

వేశాయి ... అమాయకంగా అతన్ని ప్రేమించింది.... ఆ ప్రేమని లేఖల్లో నింపింది. అతనికి పంపింది. ఆ పైన ఆలస్యంగా గ్రహించింది మదన్ ప్రేమ పాములాంటిదని !....

అంతకు ముందే అతను "లత" అనే మరొక అమ్మాయిని ప్రేమించి... పెళ్ళాడతానని మాటఇచ్చి తన కోరికలు తీర్చుకుంటున్నాడు .... ఆ నిజం తెలుసుకున్న సుజాత అతన్ని దూషించింది. ద్వేషించింది. తప్పుదారిలో నడిచినా తను తప్పటడుగు వెయ్యనందుకు ఆనందించింది. అతన్నుంచి దూరంగా వెళ్ళిపోయింది.

అభిమానించే విమలక్క మాటలతో మనసు దిటువు చేసుకుని, గుణవంతుడైన "రవి"ని పెళ్లి చేసుకుంది ... గతాన్ని చెరిపేసి నిర్మలమైన కొత్త బ్రతుకులోకి అడుగుపెట్టింది.

కాని చెరిపేసిన గతంలో చెరగక మిగిలిపోయాయి... ప్రేమలేఖలు....! తనకి అందని ఆమె మీద పగబట్టిన మదన్....లతద్వారా సుజాత కాపురంలోకి పాముల్లాటి ప్రేమలేఖలని ప్రవేశపెట్టాడు....అప్పటినుంచి ఆమె జీవితం అస్తవ్యస్తం అయిపోయింది. ఆవేదన – అశాంతి – నిందలు – నిజాలు – అన్నింటిలోంచి బయటపడాలని సుజాత చేసిన ప్రయత్నమే "ప్రేమలేఖల" చిత్రకథ.

# "ప్రేమలేఖలు"

## పాట నెం. 1

రచన : శ్రీ శ్రీ

పాడినవారు : సుశీల-వాణీ జయరామ్

లత : ఈ రోజు మంచి రోజు
మరపురానిది
మధురమైనది
మంచితనం ఉదయించిన రోజు

సుజాత : ఈ రోజు మంచి రోజు
మరపురానిది
మధురమైనది
ప్రేమసుమం వికసించిన రోజు ॥ఈ రోజు॥

లత : తొలిసారి ధృవతార దీపించెను
ఆ కిరణాలే లోకాన వ్యాపించెను

సుజాత : తొలిప్రేమ హృదయాన పులకించెను
అది ఆనంద దీపాలు వెలిగించెను

లత : తెలి కాంతులతో

సుజాత : సుఖ శాంతులతో

ఇద్దరు : జీవనమే పావన మీ నాడు ॥ఈరోజు॥

సుజాత : రెండు నదుల సంగమమే అతి పవిత్రము

లత : మతములన్ని ఒకటయితే మానవత్వము

సుజాత : మనసు మనసు లొకరి కొకరు తెలిపేరోజు

లత : తీరని కోరికలన్నీ తీరేరోజు

సుజాత : అనురాగాలు

లత : అభినందనలు

ఇద్దరు : అందించే శుభసమయం నేడు ॥ఈరోజు॥

# పాట నెం. 2

రచన : ఆరుద్ర

పాడినవారు : సుశీల — బాలసుబ్రహ్మణ్యం

సుజాత : ఇది తీయని వెన్నెల రేయి
మది వెన్నెల కన్నా హాయి
నా ఊహల జాబిలి రేఖలు
కురిపించెను ప్రేమలేఖలు ॥ఇది తీయని॥

సుజాత : నడిరాతిరి వేళ నీ పిలుపు
గిలిగింతలతో నను ఉసిగొలుపు

మదన్ : నును చేతులతో నను పెనవేసి
నా ఒడిలో వాలును నీ వలపు ॥ఇది తీయని॥

సుజాత : నా మనసే కోవెల చేసితిని
ఆ గుడిలో నిన్నే నిలిపితిని

మదన్ : నీ ఒంపులు తిరిగే అందాలు
కను విందులు చేసే శిల్పాలు ॥ఇది తీయని॥

మదన్ : నీ పెదవులు చిలికే మధురిమలు
అనురాగము పలికే సరిగమలు
సుజాత : మన తనువులు కలిపే రాగాలు
కలకాలము నిలిచే కావ్యాలు ॥ఇది తీయని॥

పాట నెం. ౩

రచన : గోపి
పాడినవారు : సుశీల - బాలసుబ్రహ్మణ్యం

మదన్ : నీ అందం, నీ పరువం
నాలో దాచుకో
కాలం తెలియని నీ కౌగిలిలో
నన్నే దాచుకో

సుజాత : ఈ అందం, యీ పరువం
నీకే అంకితం
రేయీ పగలు, వెన్నెల కాదా
నీతో జీవితం ॥నీ అందం॥

సుజాత : వీచే గాలి పూచే పూలు
గుస గుస లాడాయి

మదన్ : కోరికలన్నీ తీరే వేపు దని
రెప రెప లాడాయి

సుజాత : ఆ తొందర చూసి ఎగిరే గువ్వలు
కిల కిల నవ్వాయి ||నీ అందం||

సుజాత : వలచిన నింగి, ప్రేయసి కోసం
వానై కురిసింది

మదన్ : ఆ వానకు తడిసిన
భూమి గుండెలో ఆవిరి ఎగిసింది

సుజాత : ఆ కలయికలోనే నింగి నేలా ||నీ అందం||
జతగా మురిసేది

## పాట నెం. 4

రచన: దాశరథి

పాడినవారు: సుశీల – రామకృష్ణ

రవి: ఈనాటి విడరాని బంధం
మనకేనాడో వేశాడు దైవం

సుజాత: ఈనాటి విడరాని బంధం
నేను ఏనాడో చేసిన పుణ్యం ॥ఈనాటి॥

రవి: సొగసెంతో కలిగీ, సుగుణాల వెలిగే
సతి తోడు కుదిరిందిలే

సుజాత: మదిలోన దాచీ, మనసార వలచే
పతినీడ దొరికిందిలే ॥ఈనాటి॥

రవి: అందాల తార నీవైన వేళ
ఆ తళుకు నేనే చెలీ

సుజాత: జాబిల్లి నీవె, జగమేలు వేళ
ఆ కాంతి నేనే ప్రియా ॥ఈనాటి॥

## పాట నెం : ౫

రచన : ఆరుద్ర

పాడినవారు : సుశీల - రామకృష్ణ

రవి : విన్నానులే

సుజాత : ఊహూ హూ...

రవి : పొంచి విన్నానులే

సుజాత : ఏమనీ...?

రవి : ఒక అమ్మాయి - అమ్మ అవుతుందని
ఈ అబ్బాయి - నాన్న అవుతాడని ॥విన్నానులే॥

రవి : సుకుమారివి నువ్వు ; పువ్వులాంటి నువ్వు
పండులాంటి పాపాయిని ఇవ్వు
అలసిపోనివ్వను, పనులు చేయనివ్వను
అడుగుతీసి అడుగు వేయనివ్వను

సుజాత : ఇంటి పనులు, వంట పనులు తమరే చేస్తే
అయ్యగారి ఉద్యోగం ఊ హూ హూ హూ ॥విన్నానులే॥

సుజాత : పాపాయే గారాలతోట
మన చిన్నారే నా ముద్దుల మూట

రవి : అయ్యగారి వైపు పడదు నీ చూపు
ఇక ముద్దులన్నీ పాపకేనా రేపు

సుజాత : అంతలోనె వచ్చిందా తమకు అసూయ
అబ్బాయి తమ పోలిక, ఆ ముద్దులు మీకే॥ ॥విన్నానులే॥

రవి : తొలి చూలి భాగ్యం-ఎంతో ఆనందం
విడిపోని అనురాగ బంధం

సుజాత : నిజమైన స్వప్నం - దిగివచ్చిన స్వర్గం
పాపాయే మన ఆరోప్రాణం

రవి : నవ్వులతో, వెలుగులతో నిండును ఇల్లు

సుజాత : పాపాయి మురిపాలే తొలకరిజల్లు ॥విన్నానులే॥

## పాట నెం 6

రచన :
కొసరాజు

పాడినవారు :
సుశీల

ఆ కాలపు బొమ్మను కానూ
ఈ కాలపు పిల్లను నేను
అన్యాయాన్నెదిరిస్తానూ
అనుకున్నది సాధిస్తానూ ॥ఆ కాలపు॥

పెళ్లీడు పిల్లవుంటే
కళ్లెదుట మసలుతుంటే
ఏ ముసలాడికో ముడిపెడతారూ
బ్రతుకంతా పంజరంలో బంధిస్తారూ
కులమూ మతమూ చూడనివాణ్ణి

కట్నం కానుక అడగనివాణ్ణి
సరిజోడును ఎంచుకోవాలీ
సరదాగా పెళ్లాడాలీ ॥ఆ కాలపు॥

అబ్బాయిలకె ఆస్తి
అమ్మాయిలకు నాస్తి
ఒక తల్లీ తండ్రీ బిడ్డలు కారా
స్త్రీ జాతికి హక్కే లేదా ?
చదువులెట్లా సాగాలి
పెళ్ళిళ్ళెట్లా జరగాలి
ఇది ఎక్కడి న్యాయ మంటానూ
ఈ తప్పులు ఉడక వంటానూ ॥ఆ కాలపు॥



వెల : 15 పైసలు

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ-4.

# సాంకేతిక నిపుణులు

కథ : యద్దనపూడి సులోచనారాణి

స్క్రీన్‌ప్లే కె. రాఘవేంద్రరావు బి. ఏ.
దుక్కిపాటి మధుసూదనరావు బి. ఏ.

మాటలు : సత్యానంద్

పాటలు : ఆరుద్ర. దాశరథి. శ్రీ శ్రీ.
కొసరాజు. గోపి.

సంగీత దర్శకుడు : సత్యం

ఛాయాగ్రహణ దర్శకుడు : ఏ. విన్సెంట్

కెమెరా : కె. యస్. ప్రకాష్

ప్లేబాక్ : పి. సుశీల, వాణీజయరామ్,
బాలసుబ్రమణ్యం, రామకృష్ణ

సాంగ్స్ రీరికార్డింగ్
పి. వి. కోటేశ్వరరావు (జెమిని)

మాటల రికార్డింగ్ : యం. బి. వాల్కే (వాసు)

కళాదర్శకుడు : జి. వి. సుబ్బారావు. బి. ఏ.

నృత్య దర్శకుడు : శీను

కూర్పు : యం. యస్. మణి

అలంకరణ : యం. రమేష్, బి. సురేష్‌బాబు

దుస్తులు : జెనార్ట్, బోడులు

స్టిల్స్ : శ్యామ్‌కుమార్

పబ్లిసిటి : ఈశ్వర్

ప్రెస్ పబ్లిసిటి : యస్. వి. కె. ఆర్.

ప్రాసెసింగ్ : శ్రీ సారథీ స్టూడియోస్
ప్రైవేట్ లిమిటెడ్. హైదరాబాద్

నిర్మాణ నిర్వహణ : జానకీపతి

నిర్మాణ పర్యవేక్షణ: పి గంగాధరరావు బి.ఇ.

సహాయ నిర్మాత : టి. వి. యస్. శాస్త్రి

సహాయదర్శకుడు : యస్. యస్.
రవిచంద్ర, బి. యస్‌సి.

నిర్మాత : దుక్కిపాటి మధుసూదనరావు, బి. ఏ.

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు, బి. ఏ.



అన్నపూర్ణా వారి

# ప్రేమలేఖలు

సులోచనారాణి నవల

దుక్కిపాటి మధుసూదనరావు

కె.రాఘవేంద్రరావు

సంగీతం సత్యం